(అని పితృస్థానములో వేసి అపాత్ర దిగువనుంచ వలెను.)

అస్త్వర్ఘ్యం।

(అని భోక్త అనవలెను.)

యాదివ్యా ఆపః పయసాసంబభూవుర్యా అంతరిక్ష ఉతపార్థి వీర్యాః। హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపః శగ్గ్ స్యోనా స్సుహవా భవంతు।

(అని కర్త అనవలెను )

(అని పితృస్థానములో కూర్చోదకము వేయ వలెను. తరువాత)

(అపసవ్యం)

(కూర్చోదకము తన చేతిలో వేసికొని పితృస్థాన మందు కూడా వేసి అర్ఘ్యపాత్రలు శోధించి అందు లోని యుదకము కొంచెము క్రిందవేసి)

(సవ్యం)

(అది కండ్ల కద్దుకొనవలెను.)

(అపసవ్యం)

అర్చనం :- అర్చత ప్రార్చత।

(అని పితృస్థానమందు నువ్వులు వేయవలెను.)

(సవ్యం)

(పవిత్రం తీసి పితృస్థానమందు గంధము ఉంచ వలెను )

అస్మత్ పితృ పితామహ ప్రపితామహాః అమివో గంధాః।

(అని అనవలెను.)

సుగంధాః।

(అని భోక్త అనవలెను. తిరిగి పవిత్రం పెట్టుకొని)

(అపసవ్యం)

(నిర్మాల్య, తులసీదళములు పితృ స్థానమందుంచ వలెను.)

ఉదకెనై వసాంకల్పికం వోధూపః।

(అని కర్త కూర్చోదకము ఇయ్యవలెను.)

సుసుధూపః।

(అని భోక్త అనవలెను.)

సూర్యస్థితంవో జ్యోతిః।

(అని కర్త అనవలెను.)

సుజ్యోతిః।

(అని భోక్త అనవలెను.)

యువాసువాసాః పరివీత ఆగాత్సఉ శ్రేయాన్భవతి జాయమానః। తంధీరాసః కవయ ఉన్నయంతి స్వాధి యోమనసా దేవయంతః।

(అని వస్త్రమున్ను)

గోపీతందనం యజ్ఞోపవీతం అలంకరణార్థం కించి ద్ధిరణ్యం పకుశం స్వాహా।

(అని యొక దబ్బున్ను దర్భయున్ను పితృస్థాన మందుంచి)

స్వధాస్వధా నమమ నమమ।

(అని అర్చన పూర్తిచేసి)

సకలారాధనైః స్వర్చితమస్తు।

(అని కర్త అనవలెను.)

యుష్మదనుజ్ఞయా మండలో ద్వర్తనం కరిష్యే।

(అని కర్త అనవలెను.)

(అపసవ్యం)

(పితృస్థానమందు గుండ్రంగా నౌక మండల మున్ను)

(సవ్యం)

(విశ్వేదేవ స్థానమందు నలుపలుకలుగా నౌక మండలమున్ను)

(అపసవ్యం)

(పార్వణ పాత్ర క్రింద గుండ్రంగా నొక మండలం
ఖున్ను చేసి ఆ మండలముల మీద ఆకులు వేయ
లెను.)

(సవ్యం)

(ప్రాణాయామం సంకల్పమున్ను చేసి.)

ఓంభూః... ఏవంగుణ విశేషణ విశిష్టాయాం
ణ్యాతిథౌ।

(అపసవ్యః)

అస్మత్పిత్రంతర్యామి ముఖ్య ప్రాణాంతర్గత శ్రీమ
నార్దన వాసుదేవ ప్రీత్యర్థం। అగ్నౌ కరణం కరిష్యే.

(అని అనవలెను.)

(ఒక దొన్నెలో కొంచెము అన్నమున్ను మరియొక
న్నెలో నెయ్యిన్ని తీసికొని పార్వణ పాత్ర యొద్ద
క్షిణముఖంగా కూర్చుని ఆ పాత్రలో అభిఘారము
సి దొన్నెలోని అన్నము ఆ పాత్రలో వేయవలెను.

అయిదు దర్భలతో ఆ అన్నమును నాలుగు భాగము
లుగా వేయవలెను. ఆగ్నేయ భాగము మీద అభి
ఘారము చేసి ఆ అన్నం దొన్నెలో నుంచుకొని
పైన చెప్పిన ఐదు దర్భలు కూడ తీసికొని
కూర్చతో నున్న పంచ పాత్ర కూడా తీసికొని అగ్ని
సమీపమునకు పోవలెను. ఆ అయిదు దర్భలలో
నాలుగు దర్భలను అగ్నివ క్రమంగా తూర్పు దక్షిణం
పడమర ఉత్తర దిక్కులందు వేయవలెను. అయిదవ
దర్భ పవిత్రమున్న వ్రేలికి పవిత్రము వలె నుంచు
కొనవలెను.)

అదితేను మన్యస్వ। అనుమతేను మన్యస్వ। సర
స్వతేను మన్యస్వ। దేవ సవితః ప్రసువ

(అన్ని అగ్నికి చుట్టూ పరిషేచన చేయవలెను.
తరువాత నొక చిన్న ఆకుమీద అభిఘారము చేసి
దొన్నెలో నున్న అన్నములో సగము రెండుసార్లు తీసి
కొని ఆ ఆకుమీద నుంచి ఆ అన్నం మీద అభి
ఘారము చేసి)




అన్నపాత్ర ఆజ్యం.

ద్విభాజ్య - దర్భలు

(సవ్యం)

సోమాయ పితృపీతాయ స్వధానమః ।

(అని హోమం చేయవలెను)

(అపసవ్యం)

సోమాయ పితృపీతాయేదం నమమ।

(అని అనవలెను. తిరిగి ఆ ఆకుమీద అభిఘారము చేసి దొన్నెతో నున్న తక్కిన అన్నమంతయు ఆ ఆకులో నుంచుకొని దానిమీద అభిఘారం చేసి)

(సవ్యం)

అగ్నయే కవ్యవాహనాయ స్వధానమః।

(అని హోమం చేయవలెను.)

(అపసవ్యం)

అగ్నయే కవ్యవాహనా యేదం నమమ।

(అని అనవలెను. చేతిలో నున్న దర్భ కూడా అగ్నిలో హోమం చేయవలెను. అగ్నికి కూర్చోద కంతో అప్రదక్షిణంగా పరిషేచన చేసి)

చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు॥ (తన ప్రవర చెప్పుకొని) అహంభో అభి వాదయే।

(తిరిగి పార్వణపాత్ర యొద్దకు వచ్చి ఈశాన్య దిక్కున నున్న అన్నభాగము దొన్నెలో నుంచుకొ అభిఘారము చేసి పితృపాత్ర యొద్దకు బోయి పాత్ర మీద అభిఘారము చేసి)

(అపసవ్యం)

(ఆ దొన్నెలో నున్న అన్నము తీసికొని పి పాత్ర మీద)

స్వధేయం స్వధేయం స్వధేయం।

(అని మూడుసార్లు వేయవలెను.)

అస్తుస్వధా। సంపద్యంతాం।

(అని పితృపాత్ర మీద తిరిగి అభిఘారము చేసి

పితరః ప్రియంతాం। అస్వధా।

(అని కర్త అనవలెను.)

అస్తుస్వధా।

(అని భోక్త అనవలెను.)

స్వధానమః।

(అని కర్త అనవలెను.)

(సవ్యం)




(విశ్వేదేవస్థానపాత్రలో అభిఘారం చేసి తిరిగి
పార్వణపాత్రయొద్దకు రావలెను. వాయువ్యభాగము
కిరము కొరకు ఒక దొన్నెలోనుంచి ఆ దొన్నె వేరే
ంచవలెను. నైఋతిభాగమును పార్వణలో కలిపి
యవలెను. భోక్తలకు వడ్డించవలెను. వడ్డనక్రమ
ట్లనగా అన్నము, పాయసము, భక్ష్యములు, నెయ్యి,
చ్చడి, పప్పు, పెరుగు తుదకు పప్పున్ను వడ్డించ
లెను. ముందుగా విశ్వేదేవ పాత్రలోను తరువాత
తృపాత్రలోను వడ్డించవలెను. నెయ్యిమాత్రము పితృ
త్రలో ముందుగా వడ్డించవలెను. చేయి కడిగికొని
ండు పాత్రల యొద్దను రెండు దొన్నెలుంచి వానిలో
మంచినీళ్ళు వేయవలెను. ఆ పాత్రలమీదను సాలగ్రామ తీర్థమున్ను తులసీదళమున్ను వేయవలెను. తరువాత త్యక్తంచేయవలెను. ఎట్లనగా ముందుగా విశ్వేదేవ పాత్రయొద్దకు వెళ్ళవలెను.

(సవ్యం)

(ఆ పాత్రలో నున్న అన్నము మీద)

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

(అని ప్రోక్షించి)

సత్యంత్వర్తేన పరిషించామి।

(అని పరిషేచన చేసి)

పురూరవార్ద్రవ సంజ్ఞిక విశ్వేదేవాః ।

(అని కూర్చతో విశ్వేదేవస్థానమును స్పృశించి కూర్చ పంచపాత్రలో నుంచి కుడిచేయి విశ్వేదేవస్థాన మందుంచి త్యక్తమంత్రము చదువవలెను. ఎట్లనగా.)

దేవసవితః ప్రసువ- పృధ్వీతేపాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వాముఖే అమృతం జుహోమి। స్వాహా। బ్రాహ్మణానాంత్వా ప్రాణపానయోర్జుహోమి। అక్షిత మసిమైషాంక్షేష్ఠాః అముత్రాముష్మిన్‌లోకే। ఇదం విష్ణుర్విచక్రమెత్రేధానిదధెపదం। సమూఢమస్యపాగ్ం సురెస్వాహా। శ్రీ విష్ణోహవ్యం రక్షస్వ। పురూరవార్ద్రవ సంజ్ఞిక విశ్వేదేవాః ఏతద్వోహవ్యం సపరికరం। "అస్తుసపరికరం।"

(అనిభోక్త అనవలెను.)

విశ్వేదేవాః ఇదంహవ్యం బ్రాహ్మణస్త్వాహావనియ్యార్థె దత్తం దాస్యమానంజాతృప్తైస్తత్సర్వం। ఇయంభూమిర్గయా భోక్తాగదాధరః। అన్నమమృతం సువర్ణపాత్రేస్థితం అక్షయ వటచ్ఛాయెయం పురూరవార్ద్రవసంజ్ఞిక విశ్వేభ్యో దెవేభ్యః స్వదంతర్యామి శ్రీ అనిరుద్ధనారాయణాయ ఇదమన్నమమృత స్వరూపం అక్షయ తృప్త్యర్థం యధా భాగం హవ్యం స్వాహాస్వాహా నమమ నమమ। గయాయాం శ్రీవిష్ణుపాదాది సమస్త పాదేషు సమస్త తీర్థేషుదత్త మస్త్వితిభవంతో బ్రువంతు।

(అని కర్త అనవలెను. బియ్యం నీరు వదలవలెను)

దత్తమస్తు। గదాధరః ప్రీతో భవంతు।

(అని భోక్త అనవలెను. కర్త దేవతలను ప్రార్థించవలెను.)

యేదేవాది వ్యేకాదశస్థ। పృథివ్యామధ్యేకాదశస్థ। అప్సుషదోమహినై కాదశస్థ। లేదేవాయజ్ఞమిమంజుషధ్వం। అగచ్ఛంతు మహాభాగా విశ్వేదెవా మహాబలాః యెహ్యత్రవిహితా శ్రాద్ధే సావధానాభవంతుతె। విశ్వేదేవతాంతర్యామిణస్తుష్టావరదా భవంతు।

అని (కర్త అనవలెను.)

సావధానాస్మః।

(అని భోక్త అనవలెను.)

(తరువాత పితృపాత్ర దగ్గరకు వెళ్ళి)

(సవ్యం)

(కూర్చోదకంతో)

ఓం భూర్భువస్సువః తత్సవితువరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధీయో యోన ప్రచోదయాత్।

(అని అన్నం మీద ప్రోక్షణ చేయవలెను.)

(అపసవ్యం)

సత్యంత్వర్తేన పరిషించామి।

(అని అప్రదక్షిణంగా పరిషేచనం చేసి)

పితృదెవాః।

(అని కూర్చతో పితృపాత్రను స్పృశించి కూర్చ అర్చన పంచపాత్రలో వేసి కుడిచేతితో పితృస్థానమును స్పృశించి త్యక్తమంత్రము చదువవలెను. ఎట్లనగా)

దేవసవితః ప్రసువ। పృధ్వీతెపాత్రం ద్యౌరపిధానం. బ్రహ్మణస్త్వాముఖె అమృతంజుహోమి స్వధా బ్రాహ్మణానాం త్వాప్రాణాపానయోర్జుహోమి । అక్షితమసి మైషాంక్షేష్ఠాః । అముత్రాముష్మిన్‌లోకే. ఇదం విష్ణుర్విచక్రామేత్రేధానిదధెపదం.। సమూఢమస్యపాగ్ం సురె। స్వధా। శ్రీవిష్ణోహవ్యంరక్షస్వ। అస్మత్ పితృ పితామహ ప్రపితామహాః...గోత్రాః...శర్మాణః... వసురుద్రాదిత్యరూపాః తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ ప్రద్యుమ్న సంకర్షణ వాసు

దేవా। ఏతద్బ్రాహ్మణ దక్షిణం సపరికరం। "అస్తుసపరి
కరం"

(అని భోక్త అనవలెను)

పితృదేవాః ఇదంకవ్యం బ్రాహ్మణస్వాహావని యార్థైదత్తం దాస్యసూనంధాతృప్తై స్త్రత్సర్వం। ఇయం భూమిర్గయా భోక్తా గదాధరః। అన్నమమృతం రజితపాత్రెస్థితం। అక్షయవటఛాయేయం। అస్మత్ పితృపితామహ ప్రపితామహెభ్యః....గోత్రేభ్యః... శర్మభ్యః...వసురుద్రాదిత్యరూపేభ్యః తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవేభ్యః ఇదమన్నం। అమృతస్వరూపం అక్షయతృప్త్యర్థం యథాభాగంకవ్యం। స్వధాస్వధా నమమ నమమ। గయాయాం శ్రీ విష్ణుపాదాది సమస్త పాదెషు సమస్తతీర్థేషు దత్తమస్త్వితిభవంతోబ్రువంతు

(అని కర్త అనవలెను,)

దత్తమస్తు।

(అని భోక్త అనవలెను. కర్త తిలలు నీరున్ను వదలవలెను.)

గదాధరః ప్రీతోభవతు।

(అని భోక్త అనవలెను.)

(సవ్యం)

(కర్త పితృ ప్రార్థన చేయవలెను.)

యేచేహపితరో యెచనేహయాగ్‌శ్చ విద్మయాగ్ం ఉచనప్రవిద్మ। అగ్నెత్వం వేత్థయతితె జాతవేద స్వధాభిర్యజ్ఞగ్ం సుకృతం జుషస్వ। దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ। నమస్వధాయై స్వాహాయై నిత్యమెవ నమోనమః। దేశకాలాభి స్సర్వం న్యూనాతిరిక్తాభ్యా మచ్ఛిద్రమస్త్వితి భవంతో బ్రువంతు।

(అని కర్త అనవలెను.)

అచ్ఛిద్రమస్తు।

(అని భోక్త అనవలెను. కర్త భక్ష్యం తాంబూల దక్షిణతో విడువవలెను.)

గయగయ।

(అని కర్త ప్రాణాయామ సంకల్పములు చేయవలెను.)

ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ।

(అపసవ్యం)

అస్మత్ పితృపితామహ ప్రపితామహాన్... గోత్రాన్...శర్మణః వసురుద్రాదిత్యరూపాన్ తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదెవాన్।

(సవ్యం)

పురూరవార్ద్రవ సంజ్ఞిక విశ్వాన్ దేవాంశ్చ ఉద్దిశ్య మయా క్రియమాణెన అనేన శ్రాద్ధెన।

(అపసవ్యం)

అస్మత్ పితృపితామహ ప్రపితా మహానాం... గోత్రాణాం...శర్మణాం వసురుద్రాదిత్యరూపాణాం తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ ప్రద్యుమ్న సంకర్షణ వాసుదెవానాం ఏతెషాం సర్వం సగుణంభూత్వా। అక్షయతృప్తిర స్త్వితి భవంతో బ్రువంతు।

(అని తిలలు నీరువదలవలెను.)

అక్షయ్యతృప్తిరస్తు।

(అని భోక్త అనవలెను.)

(సవ్యం)

ఏకోవిష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః। త్రీన్లోకా న్వ్యాప్యభూతాత్మభుంక్తె విశ్వభుగవ్యయః॥ అనెన బ్రాహ్మణ సమారాధనెన పితృయజ్ఞెన భగవాన్- శ్రీమధ్వాచార్యాణాం హృత్కమల మధ్య నివాస్యనంతకల్యాణగుణ పరిపూర్ణ క్షీరాబ్ధిశాయీ, వాయు, హనుమద్భీమ మధ్వాంతర్గత మాధవనామ

కృష్ణ వేదవ్యాసాత్మక భా-ర-ము మాసనియామక మూర్త్యాత్మక పితృశబ్దవాచ్య అస్మత్పిత్రుతర్యామి శ్రీమజ్జనార్ధన వాసుదేవః ప్రియతాం ప్రీతోభవతు శ్రీకృష్ణార్పణమస్తు॥

(బియ్యం నీరు వదలవలెను.)

మధువాతాఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నః సంత్వోషధీః మధునక్తముతోషసో మధుమత్పార్థివం రజః। మధుద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తుసూర్యః మాధ్వీర్గావో భవంతునః

(అని తేనెవడ్డించవలెను. భోక్తలకు సాలగ్రామ తీర్థము, తులసీదళములు అంగారమున్ను ఇయ్యవలెను, తరువాత జందెము పేరుగా వేసుకొని ఉత్తర ముఖంగానుండి విష్ణుపాదం మీద తులసీపుష్పములున్ను అక్షతలున్ను పూజచేయవలెను.)

విష్ణోశ్చధాతృశివశక్ర గుహేందుసూర్యవహ్ని్న్ద్రత యేభ ముఖ క్రౌంచఘటోద్భవానాం యత్కాశ్యపస్య హృదయస్య గదాధరస్య పాదాన్నమామి సతతం పితృముక్తి హేతూన్। గయాయైనమః గదాధరాయ నమః శ్రీ లక్ష్మీనృసింహాయనమః మధ్వాది గురుభ్యో నమః గయేయం గయేయం।

(సవ్యం)

దేవేభ్యః తత్సదమృతమస్తు।

(అని విశ్వేదేవపాత్రయొద్ధ తుడువవలెను.)

(అపసవ్యం)

పితృభ్యస్తత్సదమృతమస్తు।

(అని పితృపాత్రయొద్ద తుడుపవలెను.॥)

యధాసుఖం జుషధ్వం।

(భోక్తల చేతులలో సాలగ్రామ తీర్థంవేసి పంచపాత్ర తీసికొని నిలుపబడి)

బ్రహ్మాంతా గురవః సాక్షాదిష్టందైవం శ్రియఃపతిః ఆచార్యాః శ్రీమదాచార్యాః సంతుమేజన్మజన్మని। నిత్యాః నిత్య జగద్ధాత్రె నిత్యాయజ్ఞానమూర్తయే। పూర్ణానందాయహరయె సర్వేయజ్ఞభుజెనమః। వాయుహనుమద్భీమ మధ్వాంతర్గత మాసనియామక ....మూర్త్యాత్మక।

(అపసవ్యం)

పితృశబ్దవాచ్య అస్మత్పితృతం తర్యామి।

(సవ్యం)

శ్రీమజ్జనార్ధన వాసుదేవః ప్రియతాం ప్రీతోభవతు। శ్రీ కృష్ణార్పణమస్తు।

(భోక్తలు ప్రాణాహుతులు పుచ్చుకోవలెను.)

ఓం ప్రాణాయస్వాహా... బ్రహ్మణెస్వాహా।

(భోక్తలకువిస్తరి స్పృశించిన వ్రేలుకడిగికొనుటకు కొంచెము నీరు వేయవలెను.)

వైష్ణవరక్షోఘ్న సూక్తాన్ పితృలింగాన్శ్రావయిష్యే।

(అని కర్త పురుషసూక్తం చదువవలెను. తరువాత కర్తలేచి భోక్తలకు ఉపచారం చెప్పవలెను)

(సవ్యం)

విశ్వేదేవాః అపేక్షితం యాచనీయం త్యాజ్యంచైవా నపేక్షితం। ఉపవిశ్యాసనె సమ్యక్ భోక్తవ్యం స్వస్థమానసైః।

(అపసవ్యం)

పితృదెవాః। అపేక్షితం యాచనీయం త్యాజ్యం చైవా నపేక్షితం। ఉపవిశ్య సుఖేనైవ భోక్తవ్యం స్వస్థమానసైః। గయాశ్రాద్ధఫలదమస్తు।




(అని భోక్తలనవలెను. తరువాత భోక్తలకు మరల పదార్థములు కొంచెము కొంచెము వడ్డించి పార్వణపాత్రలో అన్నం మొదలైన పదార్థము లన్నియు వేసికొని దానిలో కొంచెము నువ్వులు, సాల గ్రామతీర్థం తులసీదళములు వేసి కలుపవలెను. పితృ శేషము కొంచెము గిన్నెలో నుంచుకొనవలెను. కలిపి నది మూడు పెద్ద పెద్ద పిండములుగాను, నొకటి చిన్న పిండముగాను చేయవలెను. భోక్తల భోజనము లైన తరువాత)

(సవ్యం)

(వికిరముకొరకు ఉంచిన దొన్నెలోని అన్నము (28వ పుట చూడుడు) మీదకూర్చొదకము గాయత్రీ మంత్రముతో ప్రోక్షించవలెను )

మధుమధుసంపన్నం ।

(అని ఆ దొన్నెలో నొక మెతుకుతీసికొని)

విశ్వేదేవాః । సర్వసంపూర్ణమస్తు । తృప్తాస్థ!

(అని విశ్వేదేవ పాత్రయొద్ద వేయవలెను.)

తృప్తాస్మః ।

(అని భోక్త అనవలెను.)

(అపసవ్యం)

ఆ దొన్నెలోని అన్నపుమెతుకు మరొకటి తీసికొని)

పితృదేవాః సర్వం సంపూర్ణమస్తు। తృప్తాస్థ।

(అని పితృస్థానమందు ఆ మెతుకు వేయవలెను.)

తృప్తాస్మ।

(అని భోక్తఅనవలెను.)

(సవ్యం)

(ఆ దొన్నెలోని మెతుకులు కొన్ని తీసికొని)

అసోమపాశ్చయెదేవా యజ్ఞభాగవివర్జితాః । తేషామన్నం ప్రదాస్యామి।వికిరం వైశ్వదైవికం।

(అని ఆ మెతుకులున్ను కొంచెమునీరున్ను విశ్వేదేవస్థానపాత్రయొద్ద వేయవలెను.)

(అపసవ్యం)

ఆ దొన్నెలోనే మరికొన్ని మెతుకులు తీసికొని)

అసంస్కృత ప్రమితా యేత్యాగినోయాఃకులస్త్రియః దాస్యామి తెభ్యోవికిరమన్నం తాభ్యశ్చ పైతృకః।

(అని ఆ మెతుకులు పితృపాత్రయొద్ద కొంచెం నీరుతో కల్పి వేయవలెను. తరువాత రెండు భోజన పాత్రలమధ్యను దక్షిణాగ్రంగా నొక దర్భ వేసి దాని మీద తిలోదకం వేసి చిన్నపిండం తీసికొని)

అగ్నిదగ్ధేభ్యః । అనగ్నిదగ్ధేభ్యః । అస్మత్కుల ప్రసూతమృతేభ్యః । అయంపిండః స్వధానమః।

(అని ఆ దర్భలు మీదవేసి)

తే సర్వే మార్జయంతాం।

(అని యొకదొన్నెలో తిలలు నీరువేసి ఆ నీరు ఆ పిండముమీదవేసి పిండము స్పృశించక ఆ దొన్నె దానిమీద బోర్లించవలెను. తరువాత పవిత్రము విప్పి పారవేసి కాళ్ళుచేతులు కడిగికొని ఆచమనము చేసి మరియొక పవిత్రము ధరించవలెను.

శేషముచ్ఛిష్టభాగోఽన్నం దీయతాం।

శ్లో॥ యజమానకులేజాతా। దాసోదాస్యో అన్నకాంక్షిణః తేసర్వేతృప్తమాయాంతు మయాదత్తేన భూతలే

(అని కర్త భోక్తల నడుగవలెను. భోక్తలు వారి విస్తళ్ళలో మిగిలిన అన్నం క్రింద వేయవలెను తరువాత కర్త భోక్తలకు ఉత్తరాపోసనముకొరకు కొంచెం కొంచెం నీరు ఉద్ధరిణితో నియ్యవలెను.)

అమృతాపిధానమసిస్వాహా। రౌరవెఽపుణ్యనిరయె పద్మార్బుద నివాసినాం। అర్థినాముదకం దత్తం అక్షయ్య ముపతిష్ఠతు।

(అని భోక్త అనవలెను. కర్త ప్రాణాయామం సంకల్పమున్ను చేసి)

(అపసవ్యంగా)

అస్మత్పిత్రంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ మజ్జనార్ధన వాసుదేవ ప్రీత్యర్థం అస్మత్పితుః ప్రాతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధీయ తిలోదక పిండప్రదానమహంకరిష్యే ।

(అని తిలోదకం వదలి)

అపాంమేధ్యంయజ్ఞియగ్ం సదేవగ్ం శివమస్తుమె

(అని పిండప్రదానను చేసేచోట గోమయంతో అలుకవలెను, అనగా కోలగా మండలముచేయవలెను. అందుమంత్రం.... అపాంజద్యం అనునది)

అపహతా అసురారక్షాగ్ం సిపిశాచావేదిషదః ।

(అని ఆ మండలమును దర్భతో తుడువవలెను.)

తామభ్యుక్ష్య ।

(అని ఆ మండలముమీద కూర్చోదకం చల్లవలెను)

అయంమునః పితరోమనోజవసః

(అని పితృదేవతలను దయచేయుడనిపిలిచి)

సకృదాచ్ఛిన్నం బర్హిరూర్ణామృదుస్యోనం పితృభ్యః స్త్వాభరామ్యహం । అస్మిన్త్సీదంతుమే పితరః సోమ్యాః పితామహాః ప్రపితామహాశ్చానుగైస్సహ।

(ఆ మండలముపైని పొడుగు దర్భలు పరచవలెను. వానిమీదవిష్ణుపాదముంచవలెను. విష్ణుపాదముమీద మరికొన్ని దర్భలుంచవలెను.)

మార్జయంతాం । పితరః మార్జయంతాం పితామహాః । మార్జయంతాం ప్రపితామహాః ।

(అని ఆ దర్భలమీద కూర్చతో తిలోదకము వేయవలెను. తరువాత నొకపిండముతీసికొని)

ఏతత్తే అస్మత్పితః.... గోత్ర ... శర్మన్ .... వసురూప...తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్న యేచత్వామత్రాను । అస్మత్పిత్రే...గోత్రాయ శర్మణే...వసురూపాయ తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్నాయ యేచతమను గచ్ఛంతి తెభ్యశ్చాయంపిండః తస్మైతే స్వధానమః ।

(అని ఆ పిండమును దర్భలమీద దిగువభాగమందుంచి దానిమీద కూర్చోదకము వేయవలెను.)

గయాయాం విష్ణుపాదాది సమస్తపాదేషు దత్తమస్త్వితి భవంతో బ్రువంతు ।

(అని కర్త అనవలెను.)

దత్తమస్తు । గదాధరః ప్రీతోభవతు ।

(అని భోక్త అనవలెను. తరువాత రెండవపిండము తీసికొని)

ఏతత్తే అస్మత్పితామహ...గోత్ర.... శర్మన్.... రుద్రరూప తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత సంకర్షణ । యేచత్వామత్రాను అస్మత్పితామహాయ... గోత్రాయ...శర్మణే ... రుద్రరూపాయ తదంతర్యామి భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత సంకర్షణాయ యేచతమనుగచ్ఛంతి తేభ్యశ్చాయం పిండః తస్మైతే స్వధానమః ।

(అని ఆ పిండము దర్భలమీద మధ్యనుంచవలెను. దానిపైని కూర్చోదకము వేసి)

గయాయాం శ్రీవిష్ణుపాదాది సమస్త పాదేషు దత్తమస్తు సమస్తతీర్థేషు దత్తమస్త్వితి భవంతో బ్రువంతు।

(అని కర్త అనవలెను.)

దత్తమస్తు గదాధరః ప్రీతోభవతు ।

(అని భోక్త అనవలెను.)

(తరువాత మూడవపిండమును తీసికొని)

ఏతత్తే అస్మత్ప్రపితామహ...గోత్ర...శర్మన్.. ఆదిత్యరూప తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత వాసుదేవ యేచత్వామత్రాను, అస్మత్ప్రపితామహాయ.... గోత్రాయ...శర్మణే .... తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత వాసుదేవాయ యేచతమనుగచ్ఛంతి తెభ్యశ్చాయం పిండస్తస్మైతె స్వధానమః।

(అని పిండము దర్భలమీదపైననుంచవలెను.)

(దానిమీద కూర్చోదకంవేసి)

గయాయాం శ్రీవిష్ణుపాదాది సమస్త పాదేషుదత్తమస్తు సమస్త తీర్థేషు దత్తమస్త్వితి భవంతో బ్రువంతు

(అని కర్త అనవలెను.)

దత్తమస్తు గదాధరః ప్రీతోభవంతు ।

(అని భోక్త అనవలెను.)

(తరువాత పార్వణపాత్రలోని అన్నమెతుకులు పిండములమీదనుంచవలెను.)

వీరంధత్త పితరః ।

(అని కర్త అనవలెను.)

చమోహూః భక్షం భక్షయేత్ ।

(తరువాత పార్వణపాత్రలోని మెతుకొకటి వాసన చూచి పారవేసి పవిత్రం విప్పిపారవేసి చేతులు కాళ్ళున్ను కడిగికొని ఆచమనముచేసి మరియొక పవిత్రము పెట్టుకొనవలెను.)

(అపసవ్యం)

మార్జయంతాం పితరః। మార్జయంతాం పితామహాః। మార్జయంతాం ప్రపితామహాః।

(అని పిండములకు పశ్చిమమైపున తిలోదకమును వదలవలెను. రెండు దర్భలు తీసికొని నీటిలోముంచి,)

అస్మత్ పితః గోత్ర...శర్మన్...వసురూప ప్రద్యుమ్న అభ్యంక్ష్వ।

(అని మొదటి పిండముమీద ఆ దర్భల నీరు పడే లాగున కదపవలెను.)

అస్మత్ పితామహ గోత్ర....శర్మన్.... రుద్ర రూప సంకర్షణ అభ్యంక్ష్వ।

(అని రెండవపిండం మీదను)

అస్మత్ ప్రపితామహ గోత్ర....శర్మన్...ఆదిత్య రూప శ్రీ వాసుదేవ అభ్యంక్ష్వ।

(అని మూడవపిండంమీదను ఆ దర్భలలో నీరు పడవేయవలెను.)

(అలాగున రెండుదర్భలు నేతిలోముంచి)

అస్మత్పితః గోత్ర... శర్మన్.... వసురూప ప్రద్యుమ్న అంక్ష్వ। అస్మత్పితామహ...గోత్ర... శర్మన్...రుద్రరూప సంకర్షణ అంక్ష్వ। అస్మత్ ప్రపితామహ గోత్ర...శర్మన్...ఆదిత్యరూప శ్రీ వాసుదేవ అంక్ష్వ।

(అని ఆ దర్భలతో నెయ్యి పిండములమీద పడ వేయవలెను.)

(సవ్యంగా)

(తరువాత పిండములకు నమస్కరించవలెను.)

(అపసవ్యంగా)

గృహాన్నః పితరోదత్త సదోవః పితరోదేష్మ ।

(అని అనవలెను తరువాత పారణపాత్రలో కొంచెము క్షీరాన్నము వేసి అందులో తిలలు నీరున్ను వేసి కలుపవలెను. ఆ పాత్ర రెండుచేతులతో యెత్తి అందులోని క్షీరాన్నము పిండములకు చుట్టూ పడే లాగున త్రిప్పవలెను)

(అందుకు మంత్రము)

ఊర్జంవహంతీరమృతం . ఘృతంపయః కీలాలం పరిస్రుతం స్వధాస్థతర్పయతమె పితౄన్ పితామహాన్ ప్రపితమహాన్।

(ఆ పార్వణపాత్ర పిండములమీద బోర్లించి)

తృప్యతతృప్యత।

(అని కూర్చతో దానిని స్పృశించి ఆయాకును తిరగదీయవలెను.)

ఉత్తిష్ఠత ప్రేతయూరా యమస్యపంథా మనువెతా। పురాణందత్తా దస్మాసుద్రవిణం యచ్చభద్రం ప్రణో బ్రూతాదాభాగధాన్ దేవతాసు।

(అని కర్త పిండముల క్రిందనున్న దర్భలను కొంచెము కదుపవలెను.)

మనోన్వాహువామహే నారాశగ్ంసేనస్తోమేన పితౄణాంచ మన్మభిః। అనఏతుమనః పునః క్రత్వే దక్షాయ జీవసే। జ్యోక్చసూర్యందృశె।

(సూర్యుని చూడవలెను.)

ఊర్జంవహంతీ రమృతంపయః। కీలాలంపయస్రుతం

స్వధాస్తు తర్పయతమే। పితృ పితామహ ప్రపితా మహానుగైసహ తృప్యత, తృప్యత, తృప్యత.

(సవ్యంగా)

కులాభివృద్ధ్యర్థం పార్వణ పూజాం కరిష్యే।
(పిండములకు షోడశోపచార పూజ చేయవలెను.)

పిండపితృ దేవతాభ్యోనమః ధ్యాయామి ఆవాహయామి। ఆసనం స॥మి॥ పాదయోః పాద్యం స॥మి॥ హస్తయోః అర్ఘ్యం స॥మి॥। ముఖే ఆచమనీయం సమర్పయామి॥ కూర్చోదకస్నానం స॥మి॥ వస్త్రం స॥మి॥ యవాక్షతాన్ స॥మి॥ తిలాక్షతాన్ స॥మి॥ దర్భపత్రాణి స॥మి। భృంగరాజపత్రాణి స॥మి॥నిర్మాల్య శ్రీతులసీదళాని స॥మి॥ ధూపంస॥మి॥ దీపం దర్శయామి। ఆచమనీయం స॥ మి॥ నైవేద్యం

(అప్పమునకు నెయ్యిరాచి దానిమీద గాయత్రీ మంత్రముతో కూర్చోదకంవేసి)

సత్యంత్వర్తేన పరిషించామి। అమృతోపస్తరణమసిస్వాహా। ఆజ్యమిశ్రిత అపూపనైవేద్యం స॥మి॥ ఓంప్రాణాయస్వాహా...బ్రహ్మణేస్వాహా।పానీయోదకం స॥మి॥ హస్తౌప్రక్షాలయామి పాదౌప్రక్షాళయామి। తాంబూలం సమర్పయామి। సువర్ణదక్షిణాం స॥మి॥ సర్వోపచారాన్ స॥మి॥ శమీపత్ర ప్రమాణేన పిండదానాద్దయాశిరె। ఉద్ధరెత్సప్త గోత్రాణికులమె కోత్తరం శతం దేశాకాలాదిభిః సర్వంన్యూనాతిరిక్తాభ్యామచ్ఛిద్రమస్త్వితిభవంతో బ్రువంతు।
(అని కర్త అనవలెను.)

అచ్ఛిద్రమస్తు।
(అని భోక్త అనవలెను.)

(ప్రాణాయామం సంకల్పమున్ను చేసి)
ఏవంగుణ విశేషణ విశిష్టాయాంపుణ్యతిథౌ
(అపసవ్యంగా)

అస్మత్పిత్రంతర్యామి శ్రీమజ్జనార్దన వాసుదేవ ప్రీత్యర్థం అస్మత్పితృపితామహ ప్రపితామహాన్.... గోత్రాన్ ... శర్మణః వసురుద్రాదిత్య రూపాన్।
తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవాన్

(సవ్యంగా).

పురూరవార్ద్రవ సంజ్ఞిక విశ్వాన్ దేవాంశ్చ ఉదిశ్య మయాకృతేన అస్మత్పితుః ప్రాతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధీయ తిలోదకపిండప్రదానేన
(అపసవ్యంగా)

పితృపితామహ ప్రపితామహానాం — గోత్రాణాం —శర్మణాం వసురుద్రాదిత్యరూపాణాం — తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవానాం

(సవ్యం)
పురూరవార్ద్రవసంజ్ఞిక విశ్వేషాం దేవానాంచ
(అపసవ్యం)
ఏతేషాం సర్వం సగుణంభూత్వా అక్షయాతృప్తిరస్త్వితి భవంతోబ్రువంతు।
(అని కర్త అనవలెను)
అక్షయా తృప్తిరస్తు।
(అని భోక్త అనవలెను.)
(కర్త తిలోదకము విడువవలెను.)
(సవ్యం)

ఏకోవిష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః।
త్రీన్‌లోకాన్వ్యాప్యభూతాత్మ భుంక్తే విశ్వభుగవ్యయః॥
అనేనపితృ యజ్ఞేన భగవాన్ వాయు హనుమద్భీమ

మధ్యాంతర్గత....మూర్త్యాత్మక అస్మత్పిత్రంతర్యామి శ్రీమజ్జనార్దన వాసుదేవః ప్రియతాం ప్రీతోభవతు। శ్రీకృష్ణార్పణమస్తు।

(కర్త బియ్యము నీరు వదలవలెను.)

(కర్త పిండములకు నమస్కరించి,)

యుష్మదనుజ్ఞయా పిండానుద్వాసయిష్యే।

(అని అనవలెను.)

ఉద్వాసాయ ।

(అని భోక్త అనవలెను.)

(సవ్యం)

(పిండిములను పార్వణపాత్రలోనుంచి అంగవస్త్రములో మూటకట్టవలెను )

(తరువాత పిండప్రదానము చేసినచోట కూర్చతో నీరు వేయవలెను.)

పిండస్థానే శాంతిరస్తు। వృద్ధిరస్తు। ఆయుష్యమస్తు। ఆరోగ్యమస్తు। కర్మసమృద్ధిరస్తు। పుత్రసమృద్ధిరస్తు। వేదసమృద్ధిరస్తు ధనధాన్యసమృద్ధిరస్తు। అరిష్టనిరసనమస్తు, పిండానాం స్వస్థానె వాసః।

(పార్వణమూట పిండప్రదానం చేసినచోట నుంచవలెను )

(సవ్యం)

(విశ్వేదేవస్థానంలో)

శివాఆపః సంతు।

(అని కూర్చోదకం వేయవలెను.)

సంతుశివా అపః।

(అని భోక్తఅనవలెను.)

యవాఃపాంతు।

(అని కర్త విశ్వేదేవస్థానంలో బియ్యం వేయవలెను )

పాంతుయవాః।

(అని భోక్త అనవలెను.)

దర్భాఃపాంతు।

(అని కర్త విశ్వేదెవస్థానంలో దర్భలుంచవలెను)

పాంతుదర్భాః।

(అని భోక్త అనవలెను.)

సుప్రోక్షితమస్తు।

(అని విశ్వేదేవస్థానమందుంచిన అర్ఘ్యపాత్రలలోని ఉదకము పార్వణపు మూటమీద కర్త వేయవలెను.)

(అపసవ్యం)

శివా అపస్సంతు।

(అని కూర్చోదకం పితృస్థానంలో వేయవలెను.)

సంతుశివా ఆపః ।

(అని భోక్త అనవలెను.)

తిలాఃపాంతు ।

(అని తిలలు పితృపాత్రమీద వేయవలెను.)

పాంతుతిలాః ।

(అని భోక్త అనవలెను.)

దర్భాఃపాంతు ।

(అని దర్భలు పితృపాత్రమీద వేయవలెను.)

పాంతుదర్భాః।

(అని భోక్త అనవలెను.)

సుప్రోక్షితమస్తు।

(అని పితృస్థానమందుంచిన అర్ఘ్యపాత్రలలోని ఉదకము పార్వణపు మూటమీద వేయవలెను.)

స్వస్తి వర్ధతామస్మద్గోత్రం ।

(అని కర్తఅనవలెను.)

విశ్వేదేవప్రసాదోస్తు। పిత్రంతర్యామి శ్రీ మజ్జనార్దన వాసుదేవ ప్రసాదోస్తు ।

(అని భోక్తలకు కర్తయొక్క దోసిట్లో ట్బియ్యం వేయవలెను. అ బియ్యము కర్త పార్వణపు మూట మీదవేసి కొన్ని తన శిరస్సుమీద కూడ వేసికొనవలెను.)

విశ్వేదేవాః భోజనపాత్రాణ్యుద్ధాల్యుష్వే ।

(అని కర్త అనవలెను.)

ఉద్వాలయ ।

(అని భోక్త అనవలెను.) కర్త విశ్వేదేవభోజన పాత్రమీద కొంచెము బియ్యము వేయవలెను.)

స్వస్తిర్బ్రూత ।

(అని కర్త అనవలెను.)

స్వస్తి ।

(అని భోక్త అనవలెను.)

మయాదత్తం శ్రాద్ధీయమన్నోదకమక్షయమస్త్వితి బ్రూత ।

(అని కర్త అనవలెను.)

అక్షయమస్తు ।

(అని భోక్త అనవలెను.)

(అపసవ్యం)

పితృపితా మహప్రపితామహాః భోజనపాత్రాణ్యుద్వాలయుష్వే।

(అని కర్త అనవలెను.)

ఉద్వాలయ ।

(అనిభోక్త అనవలెను. (కర్త పితృపాత్రభో కొంచెము తిలలువేయవలెను.)

స్వస్తిర్బ్రూత ।

(అని కర్త అనవలెను.)

స్వస్తి ।

(అని భోక్తఅనవలెను.)

మయాదత్తం శ్రాద్ధీయమన్నోదకమక్షయమస్త్వితి బ్రూత ।

(అని కర్తఅనవలెను.)

అక్షయమస్తు ।

(అనిభోక్త అనవలెను.)

(సవ్యం)

(కర్త భోక్తలకు దక్షిణలిచ్చి)

దక్షిణాఃపాంతు ।

(అని అనవలెను.)

పాంతుదక్షిణాః ।

(అని భోక్తలనవలెను. తరువాత కర్త కూర్చ విప్పివేయవలెను. అందులోని దర్భలమొదళ్ళు సరిగా తీసిపట్టుకొని)

ఋదేత్వారు చెత్వాస మ్యక్స్రవంతి సరితోనధేనాః। దంతర్హృదా మనసాపూయమానాః । ఘృతస్యధారా అభిచాకశీమి హిరణ్యయోవెతసోమధ్య ఆసాం । తస్మింత్సుపర్ణోమధుకృత్కులాయీ భజన్నాస్తెమధు దేవతాభ్యః। తస్యాసతె హరయస్సప్తతీరెస్వధాందుహానా అమృతస్యధారాం ।

(అని చదువుచు)

(అపసవ్యం)

పితృభ్యస్స్వధోచ్యతాం పితామహేభ్యో స్వధోచ్యతాం। ప్రపితామహేభ్యస్స్వధోచ్యతాం । పితరః ప్రీయంతాం ।

(అని ఆ దర్భల మీద నీరువేసి కొసలనీళ్ళు పార్వణపు మూట మీద పడునట్లు వదలవలెను.)

(సవ్యం)

(ఆ దర్భల చివరలు పట్టుకొని)

విశ్వేదేవాః ప్రియంతాం ।

(అని దర్భల మీద నీరువేసి ఆ దర్భల మొదళ్ళ నీరు పార్వణపు మూట మీద పడునట్లు వదలవలెను. తరువాత ఆ దర్భలు క్రింద పడవేయవలెను. పితరుల నావాహన చేసినఐదుదర్భలు(18వపుట చూడు)న్ను తీసికొని)

వాజెవాజెవతవాజినోధ నెషువిప్రా అమృతా ఋతజ్ఞాఅస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాంతు పధిభిర్దేవయానైః॥

(అపసవ్యం)

ఉత్తిష్ఠత పితృపితామహ ప్రపితామహాః।

(అని ఆ అయిదు దర్భలలో మూడు దర్భలుపితృ స్థానమందుంచవలెను.)

(సవ్యం)

అనూత్తిష్ఠేతాం విశ్వేదేవౌ।

(అని తక్కిన రెండు దర్భలున్ను విశ్వేదేవ స్థానమందుంచవలెను. తరువాత కర్త యిట్లు ప్రార్థించవలెను.)

దాతారోనోభి వర్ధంతాం వేదాస్సంతతిరేవనః॥ శ్రద్ధా చనోమావ్యగమత్ బహుదేయం చనోస్తు। అన్నంచనో బహూభవెత్ అతిథీం శ్చలభెమహి। యాచితారశ్చన స్సంతు మాచయాచిష్మ కంచన॥

(భోక్తలిట్లాశీర్వచనము చేయవలెను.)

దాతారోనోభివర్ధంతా వెదాస్సంతతిరెవనః। శ్రద్ధా చనోమావ్యగమత్ బహుదెయంచనోస్తు। అన్నంచనో బహూభవెత్ అతిథీంశ్చలభధ్వం। యాచితారశ్చ వస్సంతు మాచయాచధ్వకంచన।

అన్నశేషః కిం క్రియతాం।

(అని కర్త అనవలెను.)

ఇష్టైః సహభుజ్యతాం।

(అని భోక్తలనవలెను.)

(భోక్తలు కర్త నిట్లాశీర్వచనము చేయవలెను.)

ఇహైవ స్తం మావియోష్టంవిశ్వమాయుర్వ్యశ్నుతం। క్రీడం తౌపుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వేగృహే। ఆయుః ప్రజాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖానిచ। ప్రయచ్ఛంతు తథారాజన్ ప్రీతాన్నాణాం పితామహాః। సత్యా ఏతా ఆశిషస్సంతు। గోత్రాభివృద్ధిరస్తు। వంశాభివృద్ధిరస్తు। సర్వాంతర్యామి భారతీ రమణ ముఖ్య ప్రాణాంతర్గ శ్రీమధ్వ వల్లభ శ్రీమజ్జనార్దన వాసుదేవ ప్రసాదోస్తు॥

(అని భోక్తలు కర్త శిరస్సుమీద అక్షతలు వేయవలెను. (కర్త భోక్తలకు నమస్కారము చేసి యిట్లు మనవి చేయవలెను.)

అద్యమెసఫలం జన్మభవత్పాదాభివందనాత్। అద్యమెవంశ జాస్సర్వేయాతావోనుగ్రహోద్ధినం । పత్రశాకాదిదానెన క్లేశితా యూయమీదృశాః । తత్క్లేశ జాతంచిత్తెతు విస్మృత్యక్షంతు మర్హథ। అసీమాంత మనువ్రజామి ।

(అని కర్త అనగా)

అనువ్రజ ।

(అని భోక్తలనవలెను.)

నమోమహద్భ్యోనమో అర్భకెభ్యోనమోయువభ్యో నమ ఆసినేభ్యః । అచ్యుతాయనమః అనంతాయనమః గోవిందాయనమః అచ్యుతానంతగోవిందాయనమః అక్షయకర్మయస్మిన్ పరెస్వర్పితం ప్రక్షయం యాంతిదుఃఖాని యన్నామతః అక్షరో[illegible]

ద్వైపామృతః కుక్షిగం యస్యవిశ్వంసదాజాదికః॥ ప్రీణ
యామోవాసుదేవం దెవతా మండలాఖండమండనం॥
యస్యస్మృత్యాచ నామోక్త్యాతపోయజ్ఞక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాంయాతి సద్యోవందె తమచ్యుతం।
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన।
యత్కృతంతు మయా దేవ పరిపూర్ణంతదస్తుమె। అనెన
పితృయజ్ఞెన భగవాన్ శ్రీ మధ్వాచార్యాణాం హృత్క

మల నివాస్యానంత కళ్యాణగుణ పరిపూర్ణ క్షీరబ్ధిశాయి
వాయుహన మద్ప్రియ మధ్వాంతర్గత మాధవ నామ
కృష్ణ వెదవ్యాసాత్మక భారతీరమణ ముఖ్యప్రాణాంత
ర్గత మాసనియామక....మూర్త్యాత్మక అస్మత్పిత్రం
తర్యామి శ్రీమజ్జనార్ధన వాసుదేవః ప్రియతాం ప్రీతో
భవతు శ్రీ కృష్ణార్పణమస్తు ।

—×—

# శ్రాద్ధాంగ తర్పణం

—×—

(ఆచమనం ప్రాణాయామం సంకల్పమున్ను చేయవలెను.)

ఏవం గుణవిశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ। అస్మత్పిత్రంతర్యామి శ్రీమజ్జనార్దన వాసుదేవ ప్రీత్యర్థం అస్మత్పితుః ప్రాతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధాంగ పరెహానికర్తవ్య తిలతర్పణమహం కరిష్యే। అస్మత్పితరం ...గోత్రం....శర్మాణం....వసురూపం ...తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత ప్రద్యుమ్న స్వధానమస్తర్పయామి।

(అని ౩ సార్లు తిలలతో తర్పణం వదలవలెను.)

అస్మత్పితామహం ...గోత్రం.... శర్మాణం... రుద్రరూపం తదంతర్గత భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత సంకర్షణ స్వధానస్తర్పయామి॥ అస్మత్ప్రపితామహం....గోత్రం.... శర్మాణం.... రుద్రరూపం తదంతర్గత భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత వాసుదేవ స్వధానమస్తర్పయామి॥ అనేన శ్రాద్ధాంగతర్పణేన శ్రీమజ్జనార్దన వాసుదేవ ప్రియతాం ప్రీతో భవతు శ్రీ కృష్ణార్పణమస్తు

(యజుర్వేద ఆబ్దిక మంత్రము సమాప్తము.)

—×—

# మహాలయ ప్రకరణం

\+ 0 +

సంకల్పం । ఏవంగుణ...పుణ్యతిథౌ అపసవ్యం అస్మత్ పితృపితామహ ప్రపితామహానాం...గోత్రాణాం ....శర్మణాం...వసురుద్రాదిత్యరూపాణాం...తదంతర్గత భా...ర....ము....ప్ర....సం....వాసుదేవానాం ...మాతృపితామహి ప్రపితామహీనాం... గోత్రీణాం ...దాయీనాం వసురుద్రాదిత్య రూపిణాం తదంతర్గత భా....ర....ము....ప్ర.. సం...వా....సాపత్నీమాతుః మాతామహమాతుః పితామహతుః ప్రపితామహీనా ..గోత్రాణాం..శర్మణాం..వసురు ద్రాదిత్యరూపాణాం తదంతర్గత భా..ర. ము....ప్ర...సం....వా నాం... మాతామహి మాతుః పితామహి మాతుః ప్రపితామహీనాం....గోత్రీణాం...దాయీనాం..వసురుద్రాదిత్య రూపిణాం తదంతర్గత భా...ర...ము...ప్ర.. సం.. వాసుదేవానాం...

ఆత్మపత్న్యాః
సుతస్య
భ్రాతుః
పితృవ్యస్య (పినతండ్రి పెదతండ్రి)
మాతులస్య (మేనమామ).
మాతులాన్యా (మేనమామ భార్య)
దుహితుః (కూతురు)
భగిన్యాః (తోడబుట్టిన పడుచు)
దౌహిత్రస్య (దౌహిత్రుడు)
భాగినేయస్య (మేనల్లుడు)
పితృష్వసుః (మేనత్త- తండ్రియొక్క సోదరి)
మాతృష్వసుః (పినతల్లి- తల్లియొక్క సోదరి)
జామాతుః (అల్లుడు)
భావుకస్య (భార్యయొక్క సోదరుడు)
స్నుషాయాః (కోడలు)
శ్వశురస్య (మామగారు)
స్యాలకస్య (భార్యయొక్క సోదరుడు)
గురోః (గురువు)
సఖ్యాః (స్నేహితుడు)
ఉపాధ్యాయస్య (చదువు చేసినవాడు)

వీరిలో తనకు నిత్య తర్పణములో వచ్చినవారు యెవరెవరుందురో వారినందర్ని యీ వరుసను ఉచ్చరించి వారి గోత్ర నామములు వసురుద్రాదిత్య రూపములు భారతన్మత్యప్రాణాంర్గతత ప్ర. సం....వా.. మూర్తులనున్న, సంకీర్తన చేయవలెను.

(సవర్ణం)

పురుషుత్పసంజ్ఞిక విశ్వేషాం దేవానాంచ। కన్యా గతేసవితర్యాషాఢ్యాది పంచమాపరపక్ష ప్రయుక్త సకృన్మహాలయాఖ్యాన్న శ్రాద్ధం అన్నేనహవిషాసద్దైవ మద్యకరిష్యే.

ధర్మపిండదాన శ్లోకాః—

1. ఆ బ్రహ్మణోయే పితృవంశజాతా మాతుస్తథా వంశభవామదీయాః। వంశద్వయేస్మిన్ మమ దాసభూతా భృత్యాస్తథైవా శ్రిత సేవకాశ్చ। మిత్రాణిసఖ్యః పశవశ్చవృక్షాస్చదృష్టాశ్చ దృష్టాశ్చ కృతోపకారాః। జన్మాంతరేయే మమ సంగతాశ్చ తేభ్యః సదాపిండ మహందదామి॥

2. పితృవంశేమృతాయేచ మాతృ వంశేతథైవచ। గురుశ్వ శురబంధునాం యేచాన్యేగతివర్జితాః తేషాముద్ధారణార్థాయ ఇమం పిండందదా మ్యహం॥

3. ఉత్పన్నకులవంశ్యానాం గతిర్యేషాంనవిద్యతే। తేషాముద్ధారణార్థాయ ఇమం పిండం దదా మహ్యం॥

4. ఉత్పన్నకుల వంశ్యానాంగతిర్యాసాంనవిద్యతే తాసాముద్ధారణార్థాయ ఇమం పిండం దదా మ్యహం॥

5. యేబాంధవా ఒబాంధవా యె యేయేజ్మని బాంధవాః। తేషాముద్దారణార్థాయ ఇమంపిండం దదామ్యహం॥

6. యాబాంధవాఒబాంధవాయా యాయాజన్మని బాంధవాః। తాసాముద్ధారణార్థాయ ఇమం పిండం దదామ్యహం॥

7. అగ్నినాభృగుపాతేన ఉద్బంధేన జలేనవా దంష్ట్రిభిర్వ్యాఘభిర్వాపి శస్త్రైర్విషగరశేనవా॥ చండాలాద్వైర్థ తాశ్చన్యే అశౌచేశయనేమృతాః తేషాముద్ధారణార్థాయ ఇమం పిండం దదా మ్యహం॥

8. అప్మత్యుకాలేజ ప్రపింగాః పుత్రదారవివర్జితాః తేషాముద్ధారణార్థాయః ఇమం పిండం దదా మ్యహం॥

9. జ్ఞాతేభ్యః అజ్ఞాతేభ్యః। విస్మృతేభ్యః తేభ్యః తాభ్యః ఇమం పిండం దదామ్యహం॥

— × —

## మహాలయంలో అర్ఘ్యపాత్రలు, పిండములున్న వేసేక్రమం.

దక్షిణం

ధర్మపిండములు

దుహితాది అన్యేషాం

తూర్పు

ధర్మ పిండములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాతుః ప్రపితామహ | మాతులాః సపత్నీ పుత్రికాః | మాతుః ప్రపితామహి | ప్రపితామహ | సుత-భ్రాతృ పితృవ్యాః తత్పత్న్యః | ప్రపితామహి |
| మాతుః పితామహ | | మాతుః పితామహి | పితామహ | | పితామహి |
| మాతామహ | | మాతామహి | పితృ | | మాతృ |
| | | | | | |

ధర్మ పిండములు

పడమర

ధర్మ పిండములు

ఉత్తరం

ఒక గోత్రం వారి పిండములతో మరియొక గోత్రం వారి పిండములు తగులకూడదు.